# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

16-12-1977 సంచిక 4





1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా

సంవత్సర చందా రు 10.00.

# ఉద్గ్రంథములు

1. నిర్వచన మహాభారతము — రు. 50–00
   పదునెనిమిది పర్వములు
2. నిర్వచన అధ్యాత్మ రామాయణము — రు. 20–00
3. నిర్వచన మహాభాగవతము — రు. 30–00
4. శ్రీ వేంకటేశ్వర విజయము — రు. 25–00
5. కుందమాల నాటకము — రు. 5–00
6. వేణీ సంహార నాటకము — రు. 5–00
7. గీత రామాయణము
   వాల్మీకమునకు గీతములు (అచ్చులో)
8. దేవీ భాగవతము ,,
9. శతక సంపుటములు ఒక్కొక్కటి — రు. 5–00


కృతికర్త : ప్రకాశకుడు :

**బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.**

10–5–5 రామారావుపేట, కాకినాడ–4.

మానవుడా. హృదయంలేని నీపూజ ఎందు కని ఆ పూలు ప్రశ్నిస్తున్నాయి క్రూరుడైన మానవుణ్ణి. తమకంటె మానవుని ఔన్నత్యాన్ని అతనికి జ్ఞాపకంచేసి శివ పూజకు నీహృదయం నాలుగు చిన్నిపూలు పూయలేనంతగా బండబారిపోయిందా అని నిలవేస్తున్నాయి. తమ ఆయువే నాలుగు గడియాలుండేదికాగా ఆ అల్ప వ్యవధిలోనే కని పెంచిన తల్లి జాతీయతను తీర్చిదిద్దుతూ, ఆమె చేతులలో స్వేచ్ఛగా ఉయ్యాలలూగుతూ, మురుస్తామని అంతలో ఆయువు తీరిపోతే ఆమె కాలిగ్రేళ్ళ దగ్గరే కన్నుమూస్తామని పరమ దయనీయంగా చెప్పుకుంటాయి.

ఈమాటలు భావుకుల హృదయాలను పండించగలవు. పూలనుగూర్చి జాలి కలిగించగలవు. 'నీ హృదయం బండబారిందా? నాల్గు చిన్నిపూలు పూయలేదా' అన్నందువల్ల శివపూజ కవసరమైనవి భావకుసుమాలుగాని సామాన్య పుష్పాలు కావన్న హితోపదేశాన్ని అందించగలవు.

అంతటితో ఊరుకోలేదుపూలు. సుగంధంపూసి గాలిని గౌరవిస్తున్నామనీ, ఆశ్రయించే తుమ్మెదలకు కమ్మని తేనెలతో విందులు చేస్తున్నామనీ, మీవంటివాళ్ళ కళ్ళకు హాయికలిగిస్తున్నామనీ, ఇంతా మా మానాన మేము స్వతంత్రులమై చేతనైన పరోపకారం చేస్తూ బ్రతుకుతూఉండే మమ్మల్ని త్రుంచి తల్లినీ బిడ్డలనూ వేరు చేస్తావెందుకని నిగ్గదీస్తున్నాయి. ఆత్మ సుఖంకోసం అన్యులగొంతులు కోసి తెచ్చే పుణ్యాత్ముడవని అధిక్షేపిస్తూ నీకు మోక్షమెట్లా లభిస్తుందని ప్రశ్న పూర్వకంగా నిషేధిస్తున్నాయి. నెత్తురు చేతిపూజ అవుతున్నందువల్ల విశ్వాత్ముడు స్వీకరించడని నిర్ణయిస్తున్నాయి. సంసారవర్తి అయిన జగదీశ్వరుడు తమ పవిత్రాత్మలను సరాసరి తానే స్వీకరిస్తాడనీ మధ్య నిర్వోక్య మవసరంలేదనీ నివారిస్తున్నాయి.

ఊలుదారాలలో గొంతు కురిబిగించి
గుండెలోనుండి సూదులు గ్రుచ్చికూర్చ
మురిపెమొందగు మూర్ఖుడు మనుజుల
మనుష్య
అకట దయలేనివారు మీరయా మనుజులారా॥
గుండెతడిలేక నూనెలో వండిపంకి
ఆత్రగాలు చేసి మా పేద నెత్తురులను
కంపు దేహాలపై గుమాయింపుకోరకు
పులుముకొందురు హంత! మీ గాలము
వారు॥

అక్కట పోయెదము మేము మాకు
పొసుగు లేదనా నాల్గుపక్కలన్
ప్రక్కలమీద దట్టికొని
మా పసిమేనులు చావుకాళ్ళతో
త్రొక్కుచు నొక్కి నొక్కి మీరలు
గో[illegible] నాడవత్తలె
ఆకులు జారిపోన్ పరమా
రంతురు మనుష్యుల పెంటకుప్పలై॥

ఈ మాటలన్నీ పూలనోముడల మానవ జాతి చూపుతున్న క్రౌర్యాన్ని గుండెలు ప్రక్కలయ్యే రీతిలో చట్టుబందులు చేస్తున్నాయి. సుడికారంతోడి పలుకుబడితో పటిష్ఠంగా సాగింది రచన.

మా వెలలేని ముగ్ధసుకు
మార సుగంధ మరంద మాధురీ
జీవితమెల్ల మీకయి త్య
జించి కృశించి నశించిపోయెను; మా

వారి శైలి పదగుంఫనంలో పాండురంగ విభుని శైలికి దీటైన ప్రౌఢమైనది. వర్ణనా ఆపద్యాలు నోటికి వచ్చేవి.

పాపం పూల కేమున్నది! అవి నోరూ వాయీ లేనివి. వ్రాసేవారి చిత్తాన్నిబట్టి ఏమనమంటే అదే అంటాయి. కవిశేఖర బ్రహ్మశ్రీ గరికపాటి మల్లావధానిగారు పుష్పవిలాపాన్ని మార్చి నవ్యక పుష్పవివేకాన్ని ప్రకటించారు. ఇది నిజంగా బహుళప్రచారం పొందవలసిన చక్కని ఖండకావ్యం. అయినా ఆధునికలోకంలో వివేకానికంటె ప్రాముఖ్యం లేనందువల్లా, ఇది వెనుకటివాటికి ప్రతిక్రియగా వెలువడిందన్న జన్మదోషం ఉన్నందువల్లా పొందవలసిన ప్రచారాన్ని పొందలేదు. న్యాయానికి పుష్పాపచయ క్రియ సంఘంలో అనాదిగా ఉన్నది. అదితగదని ప్రతిక్రియగా పుష్పవిలాపం వెలువడింది. అందులో వివేకం లేదని పుష్పవివేకం వెలువడింది. అందుచేత దీన్ని ప్రతిక్రియగా చిన్నచూపు చూడగూడదు.

ఇందులోనూ సరిగ్గా పద్యాలుగుపద్యాలే ఉన్నాయి. నూటికి నూరుపాళ్ళ వివేకంతో, ప్రత్యక్ష ఔచిత్యంతో, స్వచ్ఛ సంప్రదాయ పావిత్ర్యంతో వెలువడిన రచన ఇది.

౧

వివిధములైన వర్ణము, ల
 వేల విచిత్ర మనోజ్ఞ వాసనల్,
నవనవలాడు మార్దవము,
 నవ్య శుభాకృతులొప్పు శిల్పసౌ
ష్ఠవ మొసంగన్ మమున్
 సృజనసల్పిన ప్రోడను దేవదేవుసం
స్తవ మొనరింతు మూర్జిత
 కృతజ్ఞతకున్ గుణమైనభక్తితోన్॥

రకరకాల రంగులూ, వాసనలూ, మార్దవమూ, శిల్పయుత సుందరాకారాలూ ఇన్ని ప్రత్యేకతలున్న ఈ పూలనుబట్టే సర్వజ్ఞుడైన సృష్టికర్త ఒకడున్నాడన్న వివేకాన్ని మానవుడు పొందవచ్చు. పుష్పాలాభగవంతునకు పూర్తి వివేకంతో భక్తిభరిత కృతజ్ఞత తెలుపుకుంటున్నాయి.

౨

నిరుపమానందకర కళానిలయమూర్తి!
సహజ సౌజన్య సామ్రాజ్య చక్రవర్తి!
ఆర్ద్రభావార్త సుకృతపథానువర్తి!
రమ్ము కైకొమ్మిదే స్వాగతమ్మునీకు॥

ఇది వివేకంగల పుష్పాలు మానవునకు సమర్పిస్తున్న స్వాగతం. అంత్యానుప్రాసతో శోభిస్తున్న మూడు విశేషణాలూ పూలను ప్రేమించే మానవుని ఔన్నత్యాన్ని సర్వాత్మనా ప్రకటిస్తున్నాయి.

3

రసమయ జీవితావసర
 రమ్యపదార్థ నయానుషక్త మా
నసులరు మీరు మానవులు
 నందితమా సుమనఃఫలంబు కై
వస మొనరించుకొన్న మృదు
 భావులు మాకొఱకై శ్రమించి సం
తసమున దేలఁజాలిన యు
 దారులు మీకివె మానమస్కృతుల్॥

నందితమా సుమనఃఫలంలో పూవులేకాక దేవతలూ ఉన్నారు. భగవదనుగ్రహంవల్ల వచ్చిన జీవితాన్ని సద్వినియోగం

చేసుకోవడం మానవుని లక్షణం. వివేకియైన మానవుడు రసమయ జీవితావసర రమ్యపదార్థ చయానుషక్త మనస్కుడై భగవద్విశ్వాసంతో వానికై శ్రమించి సంతోషంతో తేలియాడుతుంటాడు. కృతజ్ఞమైన పుష్పలోకం వానికి నమస్కరిస్తోంది.

౮

చేలమెత్తగఁ ద్రవ్విలీలమై మడిగట్టి
మేలైన విత్తనాల్ చాలువోసి
ఉదయాస్తమయములం బొడికంబుగానీగ
చేతులపైనెత్తి చిలుకరించి
మొలకలెత్తగఁ బుర్వుపుల్గుల కెడమీక
యాచ్ఛాదన మొకింత యలవరించి
మారాకులెత్తి రెమ్మలు రాకపూర్వమే
యెత్తివేయుగ నెడంబిచ్చి నాటి
పాదులొనరించి బలమిచ్చి ప్రోదిసేసి
మొగ్గదొడిగిన లోలోనఁ బొంగిపోవు
మీరె మాదైవతములు – మీమేలు నెట్లు
మఱవవచ్చునె యెన్ని జన్మములకైన ॥

మానవజీవితంలో ప్రతిదానికీ కృషి అవసరం. కృషితోనాస్తి దుర్భిక్షం అన్న సూక్తి ఉండనే ఉన్నది. వ్యవసాయం చేసేవానికి అడుగడుగునా భగవద్భావన అవసరమవుతూ ఉంటుంది. ప్రతిపనిలోను ఎన్నెన్నో ఆటంకాలు ఎదురవుతూ ఉంటాయి. పురుషప్రయత్నానికి దైవానుకూల్యం తోడ్పడకపోతే ఫలితమే ఉండదు. ఇందులో వర్ణితమైనపనులన్నీ అన్ని పూలమొక్కలకు అవసరం కాకపోవచ్చు. దేనికితగ్గ కృషి దానికి చేస్తేనే భగవదాస్తిక్య భావోద్దీపక పుష్పజాతి లభిస్తుంది.

మానవ భావనలో పుష్పాలకూ దైవానికీ విడదీయరాని సంబంధం ఉన్నది. దేవాలయావరణములలో నందనవనాలు పెంచడం మన సంప్రదాయం. భగవత్సేవకూ రసమయజీవితానికీ తా మవసరమన్న దృష్టితో తమకోసమింత శ్రమిస్తున్న మానవలోకాన్ని పుష్పలోకం దైవతంగా భావించడంలో ఆశ్చర్యమేమున్నది? కృతజ్ఞమై ఉండడం వాటి కర్తవ్యం.

౯

కన దినమాత్ర జీవిత వి
కాసముఁగల్గిన మమ్ము దేవతా
ర్చన విధిలో మహామహుల
ప్రాజ్ఞుల సత్కృతి సేతకో వసూ
జనము ప్రసాధన క్రియకో
సద్వినియోగ మొనర్చి ధన్యజీ
వనత ఘటించు మానవులు
భవ్యులు మాకనపాయమిత్రముల్.

ఈ మాటలలో అచ్చమైన వివేకమున్నది. పుష్పాల ఆయుర్దాయము ఒక్కరోజునుమించి ఉండదు. మానవుడు వాటి నుపయోగించకపోతే పుట్టినచోట రాలిపోవలసినవే. అట్టివాని జీవితాలను సద్వినియోగ మొనర్చి ధన్యత్వాన్ని కూరుస్తున్నారు మానవులు. వారిని భవ్యులనుగా తమ కనపాయమిత్రములనుగా పూవులు భావించడం సహజం, సమంజసం! ఎవరి జీవితాలైనా మరొకరి కుపయోగించగలిగినప్పుడే ధన్యత్వాన్ని పొందుతాయి. తారతమ్యమున్నా అందరి జీవితాలూ బుద్బుదప్రాయాలే!

౬

అలఘుతర ప్రభాహృదయ
హారిగుణంబులు కొన్నిగల్గి యి
య్యిల జనియించి నందులకు
నేరికి నేనొకమాత్ర మోదమున్
గొలుపగ లేక కొండలనొ
కోనలనో యణగారిపోవ మా
కిలుములివెల్లఁ గాఁడవి
గాచిన వెన్నెల కాకపోవునే!

ఇది లోకోత్తరమైన వివేకం. గుణముండీ గుర్తింపు లేకపోవడంకంటె దురదృష్ట ముండదు. 'న రత్న మన్విష్యతి మృగ్యతే హితత్' రత్నము తన్నుపయోగించే వారిని తాను వెతుకుతూ పోదు. ఉపయోగించేవారే దాన్ని వెతుక్కుంటూ వెళ్తారు. పుష్పమూ రత్నంవంటిదే. ఉపయోగించే వారే దాన్ని వెతుక్కుంటూ వెళ్ళాలి. అల్పాయుష్కమయినందువల్ల వారి రాక సకాలంలో జరగాలి. లేకపోతే జీవితమే వ్యర్థమవుతుంది.

౭

బంగరు పంటదానిఁ బుట
పాకములోఁ బడవైచి కాచి సు
త్తింగడు మొత్తినన్నఁ గల
దే సదలంకృతి గౌరవంబు? సూ
చిం గొని గ్రుచ్చుచున్న నొక
చెండుగ నౌదల కెక్కు భాగ్యమె
ట్లుంగి లభించు మాకు సుమ
పాళికి? లబ్ధికోలంది కష్టముల్ ॥

లబ్ధికోలంది కష్టముల్. జీవితమర్మాన్ని ఉద్ఘాటిస్తున్న అర్థాంతరన్యాస మిది. ఈ తత్త్వం తెలియక కష్టపరాఙ్ముఖత్వం వహించి సుఖలాలసత్వంతో స్వార్థగ్ర దూరులవుతున్నందువల్లనే మానవులు మానవజీవిత పరమార్థాన్నందుకోలేక పోతున్నారు. ఎంత లబ్ధికోరితే అంతటి కష్టం పడితీరాలి. ఇది ఎంతటివారికైనా తప్పదు. సృష్టిలో దేనికీ సులభమార్గం లేదు. నియతి నెవ్వరూ అతిక్రమించలేరు.

౮

అండజయాన యూర్జితక
లానుభవజ్ఞులు పేర్మిమై మమున్
కెండులుగా ఘటించి తమ
శిష్ట కలాపము లాచరింప మా
గుండెలలోన సూదులను
గ్రుచ్చుట కేత్తుమె? సిగ్గుసిగ్గె
పండువు మాకు, యజ్ఞపశు
బంధ మహత్త్వ మెఱుంగలేని పా
షండుల మాదుమే? పుటుక
నాపులసంగతి మాకు వింతయే?

ఇది బౌద్ధులకు వైదికులిచ్చే సమాధానము. జన్మ మృత్యురహస్యం తెలిసినప్పుడే త్యాగమహత్త్వం తెలుస్తుంది. 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' త్యాగం చెయ్యడానికిగాని అవడానికిగాని అవకాశము అందరికీ లభించదు. దానికెంతో యోగ్యత ఉండాలి. ఈ కబుర్లేం? త్యాగమవడానికి కెవరు సిద్ధపడతారు? యాజమానిని యజ్ఞపశువు చేస్తే దానికష్టం తెలిసివస్తుందని యజ్ఞద్వేషులంటూ ఉంటారు. శాస్త్రవిశ్వాసం లేనప్పుడు ఈ విమర్శ రాకతప్పదు. పశువు లేమనుకుంటాయో అవి చెప్పలేవు కాబట్టి మనకు తెలియదు. కాని ఫలితంమీది విశ్వాసాన్ని బట్టి త్యాగావేశం పొందుతూ ఉండడం మన అనుభవంలో ఉన్నదే. శాస్త్రజ్ఞుల

ఆహ్వానాలను పురస్కరించుకుని తమ జీవితాల నర్పిస్తున్న త్యాగధనుల నెందరినో చూస్తున్నాము. ఆంధ్రరాష్ట్రావతరణానికి హేతుభూతుడైన అమరజీవి పొట్టి శ్రీరాముల ఆత్మార్పణ నేమంటాము? తత్త్వం తెలిసినవారు త్యాగానికి వెనుకాడరు. దేశ దాస్యవిమోచనాని కెందరో ఉరకంబా లెక్కారు.

౯

దివికిం దీటగు పూత భారత ధరి
త్రిన్ త్యాగభోగంబులు, లా
గ్జవ శౌర్యంబులు సాజమయ్యు నిపు డే
శాపంబో? యేకాంత మా
ర్దవ దోషోపహత స్వభావు లగుచున్
ధర్మం బధర్మంబు నే
దో వివేకింపగ లేని దీన జడబు
ద్ధుల్ ప్రోది కానేటికో?

సగధర్మ మోహమే ఈ అనర్థానికి హేతువు. ఈపద్యం పవిత్రగీతాస్మృతితో వెలువడింది.

కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః

అన్న అర్జునవాక్యమే ఇలాదిగివచ్చింది. ఆ సాంఖ్య యోగాధ్యాయాన్ని మననం చేస్తేనే కలగవలసినవివేకం కలుగుతుంది.

౧౦

ఇహము పరమ్ము రెండు తుల
కెత్తి సమమ్ముగ బూరుషార్థ ని
ర్వహణ మొనర్చు శ్రౌత మన
పద్య సనాతన మీసడించిరే
యిహ మొక పరమ్ము సుంత మొల
యించు నవైదిక దుష్పథమ్ము సం
స్పృహ బడ నేల? సంస్కృతి వి
హీనత మై చెడ నేల మానవుల్?

వికసనశీలా లవడంచేత ఆకాశ తత్త్వాలైన పుష్పాలచేత మానవుల కీప్రశ్న వేయించడ మెంతో సమంజసంగా ఉంది. అనుభవానికి విరుద్ధమైన అపప్రచారానికి లొంగి భారతీయుడు స్వధర్మచ్యుతి నందుతున్నాడు. వేదధర్మాన్ని అనుష్ఠించినంత కాలం భారతదేశం ఐహికంగానూ సర్వోత్తమంగా ఉన్నది. పారమార్థికంగా జగద్గురుత్వాన్నే వహించింది. తమ తమ దేశాల్లో తిండిలేక ఇక్కడ సమృద్ధిగా ఉందని బ్రతుకుదామనివచ్చిన విదేశీయులు దౌర్భాగ్యంకొద్దీ ప్రభువులై ఇహపరసాధకమైన వేదధర్మాన్ని ఈసడిస్తే దూదూ బసవన్నలమై మనమూ ఈసడిస్తున్నాము. రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందీ స్వధర్మాన్ని అభిమానంతో అవలంబించలేక పోతున్నాము. ఇంతకంటె జాతికి పతన మేముంటుంది?

౧౧

పత్రమొ పుష్పమో ఫలమొ
భక్తి నొయిం బరమేశు నర్చనం
బాత్ర మొనర్ప గా గలుగు
ప్రాజ్ఞులు తాము తరించి మాకు నా
ముత్ర ఫలాప్తికై సుకృత
మున్ ఘటియించినవారు గారె? యీ
మాత్ర కృతజ్ఞతన్ గనని
మందులమంచు మమున్ దలంతురే!

పుష్పవివేకంలోని పూలకు గీతా సంస్కారం గాఢంగా ఉన్నది. దానికితగట్టుగానే తమ వివేకాన్ని ప్రదర్శిస్తున్నాయి.

౧౨

ఉల్లములందు మా కొలకు
నువ్విళులూరెడు వారు వారపూ

తల్లజముల్ నితాంతము ము
దంపడుచే పదివేలు మాకు, ను
త్ఫుల్లతఁ గాంచినన్ దడవు
పోలదు నిల్వఁగ, విచ్చు మొగ్గలే
కొల్లలుగాగఁ గోసికొని
కోమలులన్ దనియింపు మింపుగన్॥

విచ్చినతరువాత చెట్టున ఎక్కువ సేపు ఉండలేము కాబట్టి వికసనోన్ముఖ ముకుళదశలోనే మమ్మల్ని కోసుకొనిపోయి మీరూ మీ ఇల్లాండ్రూ ఆనందించండంటున్నాయి. ఈపూలఔదార్యానికి ధన్యవాదా లర్పించడం మన ధర్మం.

౧౩

నిక్కువ మింతకంటె నల
నీరజనేత్రలె వచ్చి తాముగా
నిక్కుచు నీటుగోటుల వ
నిందిరుగాడుచుఁ గుల్కు పల్కులం
జొక్కుచు సోలుమన్ దళుకుఁ
జూపులఁ గప్పుచుఁ బూలకోఁతఁగో
జక్కిలిగింతలన్ గొలుపు
సౌఖ్యములే నిరవద్య హృద్యముల్॥

అనౌచిత్య స్పర్శలేని పరమ సుకుమార నాగరక భావన. పురుషుడు వచ్చి పూలుకోయడంకంటె తమవలె సుకుమారలైన సుందరాంగులే వచ్చి హావభావ విలాసాలు ప్రదర్శిస్తూ పుష్పాపచయం చేస్తుంటే తమకెంత ఆనందమో వ్యక్తం చేస్తున్నాయి. ఈ మాటలు పురుషులకు కొంత అసూయాహేతువులైనా వాటి కానందమంటుంటే మనదేం పోయింది. అలాగే పంపిద్దాము. నిజానికి లతాంగులే లతాంతాపచయం చెయ్యడం మన ఆచారం. వారూ వారూ సజాతీయులనిపించడం సహజమే గదా!

౧౪

పుష్పవల్లి, సరోజాక్షి, పూవుఁబోణి,
మల్లె, మల్లిక మొదలైన ముద్దుపేర్ల
గాటముగ మాపయింగూర్మిఁ జాటుకొనెడు
సమ్మతహృదయులుగారె మీయాడువారు!

నేలరాలిపోయే పూలను నెత్తిన పెట్టుకుంటూ తత్సంబంధ నామధేయాలు ధరించి పరమాభిమానాన్ని ప్రదర్శిస్తున్న స్త్రీజాతిని పుష్పజాతి సముచితంగా అభినందిస్తోంది. విలాపం పేరుతో తమ కజ్ఞాలాపాదించిన కళంకాన్ని వివేకం పేరుతో తుడిచివేసుకున్నది.

'జ్వలతి చలితేంధనోఽగ్నిః' అన్నట్లు అవధానిగారి మేధాగ్ని కదిలింపుతో ప్రజ్వలించి ఈ పుష్పవివేక ఖండకావ్యాన్ని ఆవిష్కరించింది. ఇది అందరికీ అందుబాటులో ఉండదన్న దృష్టితో అన్ని పద్యాలూ అనుస్యూతంగా ఉదహరించాను. దీన్ని వారి శిష్యులే యామునజాల వెంకట

( తరువాయి 12 వ పేజీలో )

# అణ్వస్త్రములు - ఒక సమాలోచన

అనువాదకులు : శ్రీ పి. నరసింహాచార్యులు, ఎం. ఏ., ఎం. యిడి., బి. ఎల్.

మూల రచన : కీ. శే. డాక్టరు డి. యస్. రాజు (కల్నలు రాజు)

మాజీ కేంద్ర ఉపమంత్రి.

చైనా పాకిస్థానుదేశము లిపుడు మన భరతఖండమునకు దురంతశత్రువులై యున్నవి. అట్టి శత్రుశక్తులను మనము ఎదుర్కొనవలసి వచ్చిన పరిస్థితులలో నుంటిమి. ఇంతవరకు వారితో నెట్టి స్నేహభావమును గాని నెలకొల్పుకొనుటలో మనము విఫలుల మైనాము. వారి దురాక్రమణ ధోరణి ఎంతమాత్రము కొరవడక అట్లేయున్నది. వారు నిరంతరము తమ ఆయుధబలమును, సైనికాధిక్యమును, పెంచుకొనుచునే యున్నారు. పాకిస్థాను మనదేశముపైమాత్రమే అదలింపులు బెదరింపులు చూపుచున్నది. కాని చైనా ప్రపంచదేశము లన్నిటిని అధికతరముగా మనదేశమును వలెనే బెదరింపులకు లోనుచేయుచున్నది.

ఏదేశమునకైనను అంతర్జాతీయ సంబంధములలో శాశ్వతమైన మిత్రులుగాని, శాశ్వతమైన శత్రుకోటివారుగాని యుండరని మనమందరము గ్రహించుకొన్న విషయమే. కాని ప్రతిదేశమునకు స్వలాభాపేక్షలో శాశ్వత అభివృద్ధిమార్గములు మాత్రము కూడియుండును. బహుక్లిష్ట పరిస్థితులలోను, సర్వనాశనము సమీపించునను భయంకర పరిస్థితులలోను, దేశక్షేమమే ముఖ్యమైన సమయములందును, ఎంతటి గర్భశత్రువులైనను సన్నిహితు లగుదురు. రాజకీయాదర్శ సూత్రములు ఒకవిధమైన ధూమాచ్ఛాదనములు. ఆ తెర మరుగుననే సర్వదేశములు తమతమ అభివృద్ధి కార్యక్రమములను, తమ దేశీయవిస్తరణకై చేసికొనుచుందురు. అట్టితరి యుద్ధములందు జయాపజయములను నిర్ణయించుటలో ఆ యుద్ధబలమే ప్రథమస్థానము నందును. దీనివలన దేశముల చరిత్రగతియే మార్పు చెందును. మానవజాతిలో నాగరికత అవతరించినది మొదలు నేటివరకు ఈసత్యము ఎట్టిమార్పు లేక ప్రబలముగా నున్నది. యుద్ధశాస్త్రమున నీ మూలాధార సూత్రములను గ్రహించి క్రమపద్ధతిలో నిర్వహించుకొనని దేశములు నశించి పూర్తిగ విస్మరింపబడినవి. ధైర్యస్థైర్యములు, నైతికబలసంపత్తి, యనువానికి విలువలు పోయినవి. ఆధునిక అస్త్రబలప్రయోగపు ఆరంభములో నిట్టిపరిస్థితు లేర్పడినవి. ఈ ఆధునిక అస్త్రప్రయోగపు యుగమున వేరొక ముఖ్యవిషయమున్నది. మానవుడు చంద్రునిపై స్వేచ్ఛావిహారము చేసి; నిర్భయముగను, విజయవంతముగను, భువికి రాగలిగిన యుగ మిది. ఈకాలమున మానవుడు ఎట్టి ప్రయోగ ప్రయత్నమునకైనను, అన్ని అడ్డంకులను అధిగమించగల సమర్థుడే. మన మిది ఎన్నటికిని విస్మరించరాదు. ఈ యుగము నందలి ముఖ్య లక్షణములతో కలసి పురోగమించని దేశములు మనుటకు అవకాశములు అతిస్వల్పములు.

ఈ పైపేర్కొన్న మూలాధారసూత్రములపై నాధారపడి మనము మన దేశమునకు ప్రాథమికమైన పునాదిని నిర్మించుకొనుటకును, సైన్యమును విస్తరింపచేసికొనుటకును, పటిష్ఠమైనరీతిగా నుండవలెను. దురాక్రమణదారులైన దేశములవారికి చాల మార్గములు, అవకాశములు ఉన్నవి. వారి ఇష్టప్రకారమే కాలము, స్థలము, ఆయుధబలము, దాడిచేయు విధానములు, ప్రథమావకాశములు పొందగలుగుట యనునవన్నియు వారి హస్తగతములై యున్నవి. మనదేశమున కన్ననో, ఈ అవకాశములలో నొక్కటియు లేదు. మనము దురాక్రమణ చేయుటకు అవకాశములే లేవు. మన కట్టి అవకాశములు భావికాలమున కలుగునను ఆశ కనుచూపు మేరలో కానరాకున్నది.

నేటి యుద్ధములలో యుద్ధ సంప్రదాయములు అతిక్రమింపబడినవి. యుద్ధనీతి, తంత్రజ్ఞతా విధానములలో ననేక రీతులు ప్రవేశించినవి. ఇవిగాక ట్యాంకులను, విమానములను, ఆయుధములను ప్రయోగించు సైనికశాఖలు, మరెన్నో తోడ్పడు చున్నవి. జీవన్మరణ సమస్య యుద్భవించినపుడు, నిస్పృహ ప్రబలిన కాలమున, సర్వనాశనకారియైన హైడ్రోజను బాంబు కట్టకడపటి యాయుధప్రయోగము కావచ్చును. దీనికి భిన్నమైన వేరొక యుద్ధ విధానము కలదు. ఇందు అతి నైపుణ్యముతో చేయబడిన అణ్వస్త్రములు కాల్బలము లోని ప్రథమశ్రేణివారికీయబడును. వాటి ప్రయోగముచే రెండు మైళ్ళవరకు శత్రు సైన్యమున రెండుమూడు శ్రేణులను సర్వనాశనము చేయవచ్చును. పైగా నీ యాయుధములను శత్రువుల కేమాత్రము తెలియనీయకుండ ప్రయోగించవచ్చును. ఈ ఆయుధ ప్రయోగము సంప్రదాయానుసారమైనదే యని అందరు నంగీకరించిరి.

ఐరోపా యుద్ధకాలమున NATA యుద్ధసైనికులకు అందరకు నీ యాయుధములు అతివిరివిగా నీయబడినవి.

చైనాదేశము పైపద్ధతులలో నేపద్ధతి నైన ననుసరించు నవకాశ మున్నది. వీరు అతి త్వరితగతిని అసంఖ్యాకముగ అణ్వస్త్ర బలమును సమకూర్చుకొని హైడ్రోజను బాంబులను కూడ, అస్త్రప్రయోగ సాధనములతో సహితము గుట్టుగ సిద్ధము చేసికొన్నారు. వీరి సహాయమున మన దేశములో నేప్రదేశము పైనైనను ప్రయోగింప సమర్థులు. ఇట్టి అణ్వస్త్ర ప్రయోగము చేయరాదని అంతర్జాతీయ సమాఖ్యవారి ఆధిపత్యమున నేర్పాటైన సంధి పత్రమున ననేక దేశములవారు ఒప్పందమున కష్టపడి సంతకములు 1963 లోనే చేసిరి. కాని వారు తమ ఆయుధములను, ఇతర దురాక్రమణదారులు తమపై దాడిచేసినపుడు, వారినుండి రక్షణకు ప్రయోగింపవచ్చుననుట మున్నగు సుగతుల సూత్రములను ఏర్పాటు చేసికొనిరి. ఈ అపవాద సూత్రములవలన తక్కిన సంధి షరతులు నిరుపయోగములే. ఏలయన, వీటిని చూపి అవకాశము పొందులోపలనే సర్వనాశనకారి యగు కార్యక్రమ మెంతో జరిగి పోవును.

ఈ సమస్యలను పరిష్కరించుటకు మన ప్రభుత్వము సంపూర్తిగ విముఖమై అత్యంతమైన పట్టుదలతో తిరస్కార భావమునే చూపుతున్నది. కాని ప్రజలకు ప్రస్తుత పరిస్థితులు పూర్తిగ నవగాహన మైనవి. తీవ్రరూపమున దారుణ పరిస్థితులు తమపై బడినపుడు మమ్మెట్లు రక్షింపగలుగుదురో తెలిపి, తగినంతగా విశ్వాసము కలిగించు పూచీ నీయవలె నని ప్రజలందరు ప్రభుత్వముపై ఒత్తిడి తెచ్చుచున్నారు.

ఈమధ్యనే, నిపుణులైన శాస్త్రజ్ఞులతో సమావేశపరుపబడిన "దీనదయాళ్ కమిటీ" వారు మన సమస్యను పూర్తిగ సర్వతోముఖముగ పరిశీలించిరి. ఆర్థికముగను, శాస్త్రపరిజ్ఞాన విధానముగను, రాజకీయముగను, నీ సమస్యను వారు పరీక్షించిరి. మనదేశము బాంబులు చేయుటే ఏకైక మార్గ మని వారందరు ఐక్యకంఠముతో సలహా యిచ్చుచు వక్కాణించిరి. సమయ మిప్పటికే మితిమీరిపోలేదు కాని; చాల ఆలస్యమైనదని వారు చెప్పిరి.

భారతదేశ మిపుడు తన చరిత్రలో నత్యంత క్లిష్టపరిస్థితులను ఎదుర్కొను చున్నది. ప్రభుత్వమును, నాయకులును, విధినిర్ణయమైన ఈసమస్యకు సరియైన పరిష్కార మార్గ మన్వేషించుటలో విఫలులైనచో, వారు భావితరములవారి శాప భావములకు గురియగుదురు. దేశచరిత్ర వలన గుణపాఠము నేర్చుకొననివారు ఆట్టి దుఃఖపరిస్థితులకు మరలమరల లోనై నాశనము చెందుదురు గదా!

* జైహింద్ *

## మూడు ఖండకావ్యాలు

( 9 వ పేజీ తరువాయి )

శాస్త్రిగారు, ఖమ్మంజిల్లా బూర్గంపాడు తాలూకా రుద్రంకోట నివాసులు ప్రకాశకులై చిన్ని పుస్తకంగా ప్రకటించారు. వెల ముప్పైపైసలు. ఏ సంవత్సరంలో ముద్రితమైందో తెలియదు. ప్రతు లిప్పుడు లభిస్తాయో లభించవో తెలియదు. ఆప్రతి ఒకటి నాదగ్గర కెలాగో చేరింది, అయిదారేళ్ళక్రితం. చదివి ఆనందించిన ఆనాడే ఇట్టివ్యాసం వ్రాయాలన్న సంకల్పం కలిగింది. ఇన్నాళ్ళకు సమాలోచన ఆపుణ్యాన్ని దక్కించుకున్నది.

పుష్పవిలాపాని కపార ప్రచారం కల్పించిన ఘంటసాల ఇప్పుడు లేరు. ఆయన నూచి ఉంటే దీనికీ ఆ అదృష్టం పట్టేదేమో! బాలమురళీకృష్ణనో, బాలసుబ్రహ్మణ్యమో దీన్ని తమ మధుర కంఠంతో పాడి లోకానికందిస్తే ఆంధ్రజాతి తన వివేకాన్ని ప్రదర్శించుకున్న ట్లవుతుంది.

వ్యాసం పెద్దదవుతోందన్న భయంతో ఎక్కడికక్కడ ఎన్నెన్నో సంకోచించవలసివచ్చింది. నాకీ ముగ్గురు కవులూ సమాన గౌరవనీయులే! వేదులవారు లేకపోయినా వారి అభిమాను లెందరో ఉంటారు. వాళ్ళల్లో నేనూ ఒకణ్ణి. ఈ తులనాత్మక పరిశీలనలో తోచిన భావాలను ప్రకటించినందులకు కవులతోపాటు కవితాభిమానులైన సహృదయులు మన్నిస్తారని విశ్వసిస్తున్నాను.

-*-*-*-

# గ్రంథ సమాలోచన

## త్రివేణి

శ్రీ చేబోలు చిన్మయబ్రహ్మకవి. ఎం.ఏ. కుసుమహరగ్రీనికేతనం. వీరభద్రపురం. రాజమండ్రి-4. గ్రంథము వెల అయిదు రూపాయలు.

సంస్కృత వాఙ్మయమున భర్తృహరి స్థానము విశిష్టతమము. వాక్యపదీయమును శతకత్రయమును (నీతిశృంగార వైరాగ్య శతకములు) రచియించిన భర్తృహరి యొకరా లేక సమాననామధేయముగల వ్యక్తిద్వయమా యను నట్టి యుక్తి సందేహము సమాహితము కాలేదు. భర్తృహరి జీవిత చరిత్రయు స్పష్టముగా తెలియదు. (నాటి వారికి నేటివారికివలె స్వీయప్రశంసాభిలాష లేకుండుట మన యదృష్టమో వారి దురదృష్టమో!) ఇట్టి యాతని జీవితమును గురించి పెక్కువిధముల కట్టుకథలు (ఏది యథార్థమో నిశ్చితముకాదు కదా!) ప్రచారములో నున్నవి. వాని నాధారముగ జేసికొని యనేక ఖండ లఘు కావ్యము లాంధ్రమున నావిర్భవించినవి. అట్టివానిలో నిటీవల వచ్చిన 'త్రివేణి' యొకటి. ఇది సుమారు రెండువందల యేబది పద్యములతో నిండియున్నది.

త్రివేణిని రచించినవారు శ్రీ చేబోలు చిన్మయబ్రహ్మకవిగారు. వీరు బహువిధుల పట్టభద్రులు. బహుగ్రంథకర్తలు. బహుధా సన్మానితులు. వీరి రచనలన్నియు భగవదంకితములే. త్రివేణిని పునరూరు (మైసూరు ప్రాంతములోనిది) విశ్వనాథున కంకిత మిచ్చిరి. ఏతత్కావ్య కన్యా సహప్రదాన కర్తలు శ్రీ పి. వి. రావుగారు. శ్రీ చిన్మయబ్రహ్మకవిగారు నిరంతర పద్యరచనా ప్రియులు. వీరి కవిత్వము సరళమై నిరాఘాట ధారాశుద్ధితో రసస సరళమై యున్నది. కందపద్యరచన సుందరతరమై యున్నది. మిగిలిన పద్యములు సుందరములుగా నున్నవి. వర్ణన, పద్యనిర్వహణ, కథానిర్వహణ, రసపోషణ, యొకదానితో నొకటి పోటీపడుచున్నవి.

ఇందు మూడుతరంగము లున్నవి. ప్రథమ తరంగము విక్రమార్కుని సభ, శారదోత్సవములు, కవిపండితాది ప్రశంస అనువానితో నొప్పారియున్నది. ద్వితీయ తరంగము భర్తృహరి దంపతుల సరసాలాపములు, సహగమనమునుగూర్చి భానుమతి యాతని ప్రశ్నించుట, భర్తృహరి యామెను పరీక్షింప నెంచి బయలు వెడలుట అనువానితో ముగియును. మూడవ తరంగమున భార్యను గోల్పోయిన భర్తృహరి నిర్వేదము, యోగిసాక్షాత్కారము, ఉపదేశము, భర్తృహరి యాత్రాగమనము, ఆతని యుపదేశములు, అనుభూతులు,

గురుప్రశంస, కలిగి భర్తృహరి త్రివేణీ ప్రవేశమున ముక్తినందుటతో ముగియును.

విక్రముడు కవిప్రశంస చేయుచు చెప్పిన 'కర్తిక బనిసెప్పవు' వంటి పద్యములు పాఠకుల నాకర్షించును. ఇట్టిపద్యములు బహువచనములోనున్నవి. మొదటితరంగములోని కవిపండితగోష్ఠులు బాగుగ నున్నవి. పద్యములను సహజసుందరములై కవిప్రతిభను భాషావైదగ్ధ్యమును వెల్లడించుచున్నవి. రెండవ తరంగము విచిత్రగతితో నడచినది. మూడవతరంగమున యోగిదర్శనము, ఉపదేశములు అనుభూతులు బాగున్నవి. పద్యములను పాఠకుని తమతోఁ బరువెత్తించునట్లున్నవి.

రాజసభారంగమున సారస్వత ప్రశంసచే సరస్వతిని; భానుమతీ భర్తృహరుల దాంపత్యమున యమునను; వైరాగ్యానుభూతి కథనమున పరమపవిత్ర యగు గంగను; మనమున నిడుకొని, పైమూడిటి కలయిక ప్రయాగయందు (యజ్ఞధాతువున కర్థము దేవపూజ-కవితా పరమ లక్ష్యము దేవపూజయే- మరొక్కటి లక్ష్యమైనచో వాగ్దేవతాదుర్వినియోగమే యగును) అనగా కవిభావనా ప్రయాగయందు జరగినట్లు భావించి కవిగారు దీని కీపేరు (త్రివేణి) పెట్టి యుందురు. ఇందలి తరంగ త్రయమును మనోహరముగఁ జిత్రించుటకు యథాశక్తిగా యత్నించిరి.

ప్రచారములోనున్న భర్తృహరి కథ. భర్తృహరి విక్రముని నెచ్చెలి. మహామంత్రి. మహాకవి. భానుమతి యాతని భార్య. వారొకనాడు సౌధోపరిభాగమున నుండగా; నొక శవమును,దాని వెనుక నేడ్చుచు బలవంతముగా దీసికొని పోబడుచున్న కాంతను, జూచి భానుమతి యిదే మని భర్త నడిగెను. అప్పు డాతఁ డది సహగమనమని పలికి దానిని వివరించెను.అది విని భానుమతి 'భర్తృమరణము తెలిసియు ప్రాణత్యాగము చేయని స్త్రీ సతియేనా? (భర్తృమరణము తెలిసియు నింకను బ్రదికియుండుట వింత) యని పరిహసింపగా; భర్తృహరి యామెను పరీక్షింప దలచి, వేటకేగి తన మరణవార్తను కల్పించి యామె కందజేసెను. ఆమె యావార్త వినుచునే మరణించెను. శ్మశానమున దుఃఖించుచున్న భర్తృహరి దృష్టినొక యోగి యాకర్షించెను. ఆయోగి తన కమండలమును తానే పగులగొట్టుకొని దుఃఖించుచుండెను. విస్మితుడైన భర్తృహరి యోగిని 'నీవు స్వయముగా పాత్రభంగము జేసికొని దుఃఖింతు వేమని ప్రశ్నింపగా యోగి' 'నీవు చేయుపనియు నదియేకదా!' యని పలికి తత్త్వోపదేశము గావించెను. అప్పుడు భర్తృహరి మహాజ్ఞాని యయ్యెను.

సిద్ధు డిచ్చిన అమృతఫలమును విక్రముడు తనకిష్టతముడైన భర్తృహరికీయగా నత డద్దానిని తన భార్యకు; ఆమె తన యుపభర్తకు; వాడు తన యుంపుడుకత్తెకు; నామె దానిని తన యిష్టునకు; నీ విధముగా నిచ్చిరి. అది చివరకు భర్తృహరి కంటబడగా నతడు దాని చరిత్రను విచారించి విరక్తు డయ్యెను. ఇట్టి కథ లనేకములు ప్రచారమున నున్నవి.

ఇది కథయగుటచే నిందలి యనౌచిత్యములను మనము విమర్శింపరాదు. కానిచో కథ యెట్లు సాగును? ఎంత మహాయోగి

భార్యగా నైనను, అసూర్యంపశ్య గా నైనను, సుకుమార హృదయపోషిత గా నైనను, ఆనాటి సహగమన సంప్రదాయము నెరుగని స్త్రీ యుండునా? కవి వైరాగ్యమునకు (వైరాగ్య శతక నిర్మాణమునకు) భార్యామరణమే హేతువు కావలెనా? లోకములోని మరణములు సుఖదుఃఖములు వాని (కవి) భావనాశక్తిని స్పందింపజేయు గలవా? వైరాగ్యశతకమున కవి కామ్యమైన నీతి శృంగారశతక రచనకు కారణమేమైయుండును? వాల్మీకి శ్రీరామాయణ రచనకు మూల మేది? ఆయనకును శ్రీరాముని యనుభవమే మైనకలిగినదా? ఇట్టి కల్పనలన్నియు మూలమో కవియందు పాఠకులకుగల యాదార్ధ్యబుద్ధి మితిమీరుటయే హేతువని చెప్పనగును. అవి యుక్తాయుక్తములను విస్మరింపజేయును కదా!

అవతారికా నిర్వహణ ప్రాచీనానుకరణమే యైనను క్రొత్తపుంతల బట్టినది. అవతారిక త్రివేణీ ప్రశంసతో నారంభమగును. ఆ ప్రశంస యర్థవాద మైనచో బాగుండునుకాని మితిమీరిన ముగిము నుత్తును. కామిత ఫలదాయినీ! జగత్కల్యాణీ! నీవదోధి చతురత్వముల్ విబుధ దీప్తి గొదారము నేర్పు' వంటివి మాటలు తాదృశములు. వెనుకటి కావ్యములు కర్పూరతాంబూలము లందినపిదప నారంభమైనవి. ఇందు కావ్య రచనానంతరము 'స్పష్టాన్నద్యుత్తమ సత్కృతుల్ నెఱపి విద్యాప్రకీర్తి నర్జించి యాత్మోన్నత్యంబును బెంచి మైత్రికోక విఖ్యాతి స్సమార్జించి ప్రేమన్నిలో కపురంపు దమ్ములమునన్ మన్నించి తా నిటనున్.' కృతిపోషకుని పితామహులని వర్ణనతో నారంభమై కృతిపోషకుని కుటుంబవర్ణన యైనపిమ్మట వంశము విశిష్టత మించునందు బూర్తి చేసిరి. ఈ వర్ణనయందు స్వోత్కర్ష కొంచెము మితిమీరినట్లున్నది.

ప్రథమతరంగమున రాజకవి పండితోత్తముల పరస్పర ప్రశంసలు మెండుగానుండి పాఠకునికి కొంత మాంద్యము కలిగించునట్లున్నవి. సమస్యాపూరణమో, వర్ణనమో, ప్రహేళికాదులలో నిర్వహించిన భాగం చెడిది.

రెండవ తరంగమున పాఠకుని సూక్తులు భాసికథాసహాయకారులైనను భానుమతీ ప్రశంసాపరములై యున్నవి. ఏ సావిత్రీచరిత్రనో, మరోకథానికనో చెప్పించిన (సంగ్రహముగ) పాఠకుల కొకింత స్ఫూర్తి కలిగించి యుండునేమో? కవి ప్రయత్నించిన భానుమతీ భర్తృహరుల శృంగారమును మరింత చమత్కారస్ఫోరకముగ చిత్రించియుండవచ్చును. భర్తృహరి, చిలుకతో వినోదించుచున్న భానుమతిని, కీరవాణిరావే నను వెడబాసి వసియింప న్యాయం బగునే?' యనిపిలువగా; వాత్స్యాయనోద్ధత తదాలాపము విని యామె తోడన శరసారాయన, సరసఘనిరై వెడలెనట. శరవేగము, నదీవేగము–ఇందు నాయికా గమనవేగము నిట్లు చెప్పుట సహృదయ హారిగ లేదు. భర్తృహరి, వచ్చిన యర్ధాంగిని గుమిచ్చిక బాహువుల నదిమి మన్నించి తదీయాచ్ఛనయన పద్మంబుల వెచ్చని నీరుడిచి కొప్పువిరుల నివురుచున్, భానుమతి సౌందర్యమును ప్రశంసించి 'నీ హృదయమును నిన్ సుమసంగ్రహముతో నింపజాలి తుష్టింగను నా సాహస

మభినందించెదవే హితకారిణి పొగడెదవే యాలివేణీ! యని పలుకగా; నామె సుముఖుని బలిగా నోచుకొను తొయ్యాలి తొయ్యాలి యని పలికి; 'కాని యంగనాజనము లకింత చిక్కుడు రసజ్ఞులు లోకము నుద్ధరింతురే' యన్నది. ఇది యెంత గ్రామ్యముగా నున్నది? ఎంత భావికథా సహకారిగానైనను దంపతులయేకాంతమున నిట్లు భానుమతిచే ననిపించుట రసపోషకము కాదుగదా! (పైభాగములలో క్రీగీటులు గీచిన పదములవిన్యాసము పరిశీలనీయము) పైగా నిది యంతయు జరగినది పగటియందా? రాత్రియందా? పౌరాణికుని సూక్తి లెప్పుడు? !) వ పద్య మెంతవరకు సరిపడును? మరునాడు మృడాపూజసేయ భానుమతి కోరగా భర్తృహరి యంగీకరించి యామె చేయిపట్టుకొని నడచెనట.

భానుమతీభర్తృహరులు శృంగార సామ్రాజ్యము నేలి పరిశ్రాంతులై యువయకాలమైనను శయ్యాత్యాగము చేయ లేదు. అప్పుడు శవము నాహారి వెంట ఘోషతో దీసికొని వెళ్ళుచుండగా వారికి మెలకువ వచ్చినదట. భానుమతి దుఃఖించుచున్న స్త్రీని జూచి యిదేమని భర్తనడిగి, సహగమన సంప్రదాయము నెరిగి 'చచ్చిన పెనిమిటితో భార్యతనువు వీడవలెనా?' యని పలుకుటయు నస్వాభావికముగ ననిపించుచున్నది. కథారసపాత్రపోషకముగా లేదు. ఇట భర్తృహరికి గలిగిన వైక్లబ్యమును, తీవ్రతను, కోరచూపులను వర్ణించుటయు కొద్దిగ మితిమీరినదేమో, యస్థానపతితమేమో, ఆ ఘట్టము మంత పరిపుష్టము కావలెనేమో యని పించును.

భానుమతిని భర్తృహరి పరీక్షించిన విధమును, కోల్పోయినవిధమును భర్తృహరి స్వగతములో సూచించినను; ఆఘట్టమును విడుచుట నవీనతగానున్నను; నిండుగా లేదనిపించుచున్నది. శృంగారశాంతముల పొందికను యుక్తరససంధానపరిపుష్టిచే నదికిన రసవత్తరముగా నుండెడిదేమో?

మూడవతరంగమున యోగిచేసిన యుపదేశములో 'ఏలతెచ్చుకొందు వొక తగులాటంబు కోరక్కవలదు'. అనుమాట సమయోచితముగా నగుపడదు. ప్రయాగలో గురుప్రశంస నందిన భర్తృహరికి ముక్తి (సిద్ధి) కాంత భానుమతి రూపమున నగపడినట్లు; నతడామెయందలి కౌతుకమున త్రివేణిలో లీనమైనట్లు వర్ణించుట నవీనముగా నున్నను; నింతగా జ్ఞానసిద్ధినందిన భర్తృహరి పాత్రకు, ఔచిత్యమునకు దగినట్లు లేదు. భర్తృహరి వేదాంతోపన్యాసములచే తత్త్వకథనముచే శాంతుడు కాని వైరాగ్యశతక రచన సూచింపవలయును, గాని దానిని సూచించిన ట్లగపడదు.

అవతారికకు ముందు పునరూపు విశ్వనాథుని గిరిజాహృదయైకనాథ సుధాకర దివ్యమౌళి, సంపాల యాప్తజనబృందమనాథనాథ యని స్తుతించిన శ్లోకము కొంత విచిత్రముగా నగుపించును. శివుడు గిరిజాహృదయమునకే యేకనాథుడా? గంగకు కాడా? భక్తులహృదయములకు గాడా? సుధాకరునిచే దివ్యమౌళి యైనాడా? అనాథనాథ యని సంబోధించి, ఆప్తజనబృందమును పాలింపు మనుట యేమి? ఇట 'సమ' అను నుపసర్గ పొవ

పూరకమూ యనిపించును. భగవంతుని పాలన సామాన్యపాలనతో పోల్చబడి యుపసర్గప్రయుక్తమైనదా ?

చంద్రికాలోచన (అవ - 2వ ప.) కడు బూని క్రొం బల్కితో గూడి, (అవ-4వ ప.) ఉద్దండకళాభిజ్ఞుడు, (అవ-3 ప.) విశిష్టాశిషభాగ్య (19 ప. - 5 పేజీ) నీ కవిత కంఠోల్లోఢ్గి (6 ప. 2 పే.) పసునార్కులు (17 ప. 5 పే.) విపులాసౌజన్య (విపులమైన అసౌజన్యమైన అని యర్థము వచ్చును) 16 ప. ప్రాసాదగుణ (13 ప.) యువతీమణులన్ (7 ప.) అమరంబగు భారతీప్రియంకరకృతులు (29 ప. 7 పే.) భావనవాగ్సుదతీ పదాబ్జసేవావిజయ ప్రబంధముగ (23 ప. 7 పే.) సంపదుదారాంచిత భర్మడోలికల (30 ప. 7 పే) కవిచంద్ర దీపమా (18 పేజీ 6 ప) మాదు సమ్మానము లందగల్గుటలు మన్ననయే యనవచ్చు నెంతయున్ (10 పేజీ 45ప. ఏ రాజైనను అర్హులను సన్మానించుచో నిట్లనుట భావ్యమా?) వైదిక గాయక శిల్పి సమాదరణీయులగు వీరు లయ్యోడరా జామోదంబందిరి (48ప 11 పే) శారద సమంచిత పత్కృపన్ (65ప 15 పే) చిత్తలోపణీ (12 ప 19 పే) మదాత్మీయ కళాభిరతివి (21 ప 21 పే) అరయంగనుబోవ డదేమి చిత్రమో (41 ప 25 పే) త్రివేణీ కన్యాభాగ్య సుధాకర (27 పే 1 ప) రసాలవాల విపుల భవ్యముల్గాని కళాపటిమం గొనియాడవు. (17 ప 30 పే) అత్యగణిత కాంతిలాస్య సముదార చరిత్రలు (22 ప 31 పే. ఈ దీర్ఘసమాసం సార్థకమేనా ?) తమ కిది యాచిత్యంచే (28ప33ప) ఉచితమేయని యుండవలెనేమో (ఉచిత-ఔచిత్య-అర్థభేదము కలదు) చదివితి నేప్రయోజనము ? (అర్థము సద్యస్స్ఫూర్తిగా లేదు - 44ప 36 పే) కార్తిక పౌర్ణమీ పర్వమందు (60ప 39 పే) శిరోమణీయుక్త (81ప 44 పే) వంటివి శాతకుల మనశ్శ్రవణ విచిత్రములై యుండును.

విదితధరామండలి నిం, పుదసర బాలించుతా మపూర్వప్రతిభన్, హృదయాలే లంగల సం, పద భారతి నోచుకొన్న వరముగు భూపా! ఇట్టి పద్యము లనేకములు. వినుత, తగ, పసందుగ, వంటివియు నగుపించును. అటనట ఋతువర్ణనలు యథోచిత మనోహరములై కావ్యమునకుఁ దగియున్నవి.

ఈ గ్రంథమునకు దర్శనాచార్య, కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారి సమీక్ష మిక్కిలి శోభావహమై సముచితమై యున్నది. అదియొక పెట్టని యలంకారము. శ్రీ యింద్రగంటి వారి యాప్తవాక్యము సముచితమై యున్నది. గ్రంథమువెనుక శ్రీ కవిగారి విశేషములు పాఠకుల యుత్కంఠ నపనయింప జాలినన్ని చిత్రపటసహితములై గ్రంథమునకు నిండుదనమును కల్గించుచున్నవి.

తాత్త్విక, భక్త, కవుల చరిత్రలను వర్ణించుచు భగవదంకితమైన శ్రీ చిన్మయ కవీంద్రులవారి కవితా ప్రవాహ మాంధ్ర పాఠకలోకమునకు నిరంతర మానందదాయిని (నిరంతర కావ్య సస్యసంపదభివృద్ధిచే) అగుగాక యను మనకోరిక వ్యర్థము కాబోదు.

— శ్రీ ప్రసాద్.

# తమసో మా జ్యోతి ర్గమయ

శ్రీమతి యస్. రమాదేవి బి.ఏ; బి. యిడి.

ఆధునిక విజ్ఞానము సువిశాలము. అన్నిరంగాలలోనూ విజ్ఞానము శాస్త్రజ్ఞుల ప్రయోగ ఫలితాలతో అభివృద్ధి చెందుతోంది. మానవులను వారిస్థితిగతులను వివిధ కోణాలనుండి పరిశీలించిన వేర్వేరు శాస్త్రజ్ఞు లున్నారు, వారి సహాయంతో ఎన్నడూ కనీ వినీ ఎరుగని సౌఖ్యాలన్నీ నేటిమానవులు సమకూర్చుకుంటున్నారు. మేధావులైన శాస్త్రజ్ఞుల మేధచే మానవు లంతరిక్షకక్ష్య లోనికి చొచ్చుకొనిపోతున్నారు. కానీ ఇన్ని సుఖాలమధ్య ఏదో తెలియని అశాంతి. అసంతృప్తి మానవుల నెల్లవేళలా వెన్నాడుతూనే వుంది. భౌతికంగా ఎన్ని సుఖాలను సమకూర్చుకున్నా అకస్మికంగా వారి కెదురయ్యే ప్రమాదాల సమస్యలను పరిష్కరించుకోలేక పోతున్నారు. దీనంతటికీ కారణం రోజురోజుకూ వారిలో అభివృద్ధిచెందుతున్న అహంకారమే అని పిస్తూంది.

"ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్॥
(అ 3. 38 శ్లో)

అని గీతలో చెప్పినట్లు పొగచే అగ్ని, దుమ్ముచే అద్దము, మావిచే శిశువు కప్పబడియున్నట్లు కామముచే మానవుల జ్ఞానము కప్పబడిఉంది. విసరడంతో అగ్ని, తుడవటంతో అద్దము, మావిని తొలగించటంతో శిశువు ప్రకాశవంతమైనట్లు కామము (కోరికలు) దూరముకానిదే మానవులు నిజమైన విజ్ఞానవంతులు కాలేరు. మానవజాతి నిజమైన విజ్ఞానాన్ని సాధించాలంటే అన్ని జ్ఞానాలకు పునాదివంటిదైన ఆధ్యాత్మిక విజ్ఞానం కొంతవరకైనా కలిగిఉండాలి. ఈసృష్టికి కారకుడు, లోకాధ్యక్షుడునై నీ పరమాత్ముని తత్త్వమును గూర్చిను కొంతైనా తెలుసుకోవాలి.

పరమాత్మకు రెండు ప్రకృతు లున్నాయి. అవి పరా-అపరాప్రకృతులు, భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు బుద్ధి, అహంకారము అను ఎనిమిది భగవానుని అపరాప్రకృతి. ఈ అపరాపకృతి వలన నేర్పడిన సృష్టి అంతా జడము. ఇది స్వయం ప్రకాశము లేక నాశన మాతూ తిరిగి పుడుతూ ఉంటుంది."...

"మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ" (అ 7 శ్లో 7) అన్నట్లు ఈజడమునకు చైతన్యం కలిగించి ప్రకాశింపజేసే శక్తే భగవానుని పరాప్రకృతి. ఇది జీవరూపమైనది. చిన్నవి, పెద్దవిమైన రంగురంగుల పూసలను ఒక్కటే దారం హారంవలె ఏలా నిలబెట్టగలదో ఆలాగే సృష్టిలో అపరాప్రకృతివల్ల ఏర్పడిన వాటన్నింటినీ పరాప్రకృతి నిలబెట్టి ఉంచుతూంది.

ఇట్టి పరాశక్తిని మరచి మానవులు నేడు తామే అన్నిటిని సాధించగల మనే అజ్ఞానాంధకారంలో పడిపోతున్నారు. తాముచేసిన కృషితో తలచినవన్నీ సాధించ

గల మని కలలు కంటున్నారు. ఉదాహరణమునకు - మంచిమేలురకం విత్తనాలను నాటుతున్నారు - అంతకంటే మేలురకపు ఎరువులను వేస్తున్నారు. క్రిమిసంహారక-మందులను జల్లి పంటలను చీడపురుగుల బారినుండి రక్షిస్తున్నారు. వీటన్నింటితో కనివినీ ఎరుగనంతటి పంటదిగుబడి రావాలని ఆశిస్తున్నారు. కానీ పంటకు కావలసింది భగవానుని సహాయసహకారాలతో లభించే తగిన ఎండ, తగినంతవాన అని తెలుసుకోలేక పోతున్నారు. ప్రకృతి విలయతాండవం చేసి పంటలను నేలమట్టం చేసి, మానవజీవన వ్యాపారాలన్నింటిని స్తంభింపజేసిననాడు ఎవ్వరూ, ఏమీ చేయలేక పోతున్నారు. ఇటువంటి దారుణము ప్రతిసంవత్సరము సంభవిస్తూనే ఉంది. ఈ విలయాన్ని అరికట్టడం - ఏరాజకీయ నాయకుల - ప్రజాసేవకుల - విజ్ఞాన శాస్త్ర వేత్తల చేతుల్లోనూ లేదు.

ఏడహోరాత్రములు ఎడతెగని ఘోరమైన వానకురవగా అలనాడు గోగోప గోపీజను లందరకు తన చిటికెనవ్రేలిని పైకెత్తి గోవర్ధనపర్వతముక్రింద రక్షణకలిపించాడు శ్రీకృష్ణపరమాత్ముడు.

శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబుపైఁ బడ్డనా
కేలల్లాడదు బంధులార నిలుడీ క్రిందం బ్రమోదంబునన్.

అని చెప్పి వారిని ఓదార్చాడు. ఇంతటి రక్షణను వారికెందుకు కలిపించాడు? ఈ గోపకులు తమప్రేమాస్పద హృదయాలతో పరమాత్మను బందీని చేసుకున్నారు. నూతన యౌవనలైన గోపికలు ప్రేమ వాత్సల్యములను ఉగ్గుపాలతో రంగరించి ఆస్వాదించినవారు. అసూయా ద్వేషాలను దూరం చేసుకొని పరస్పరం అన్యోన్యంగా జీవిస్తూ నోములు వ్రతాలు చేసేవారు. ఆ నోముల కాలంలో వారు నేయి, పాలు, మీగడ తినకుండా, పువ్వులు తలలో ధరింపక, కనులకు కాటుక పెట్టక మార్గశీర్ష పుచలిలో తెల్లవారుజాముననే లేచి, శ్రీమహావిష్ణువును గూర్చి సామూహిక భజనలు చేసేవారు. "ప్రభూ దయతో చాలినంత వర్షము ఎల్లెడల కురిపించి మాప్రజలంతా సుఖంగా ఉండేటట్లు; పంటలు బాగుగా పండేటట్లు; చూడు. మాగోవులు పచ్చిక తిని బాగా బలిసి కానలనిండుగ పాలిచ్చేటట్లు చెయ్యి. నీదయతో ఏకష్టమూ ఎరుగకుండ మా జీవితా లన్నీ కొనసాగిపోయేటట్లు చూడు." అని విశ్వాధారుఁడైన పరమాత్ముని వేడుకొనేవారు. ఇదే మన ఆర్ష ధర్మము.

ఇటువంటి మనఆర్షధర్మానికి నేడు అన్యాయం జరగిపోతూంది. అసూయా ద్వేషాలు, పదవీవ్యామోహాలూ ఎల్లెడల తాండవిస్తున్నాయి. ప్రేమవాత్సల్యములు కనుమరుగై పోతున్నాయి. మానవులందరూ తమతమ హృదయాలలో ప్రేమజ్యోతులను వెలిగించి సామూహిక ప్రార్థనలను జరపాలి. మన ఆర్షధర్మమును కాపాడాలి.

"ధర్మో రక్షతి రక్షితః" అన్నట్లు ధర్మాన్ని మనం రక్షిస్తే ధర్మమే మనలను రక్షించి మనజీవన గమ్యాలలో ఎదురయ్యే కారుచీకటులను పారద్రోలే వెలుగుదివ్వెలను ప్రసాదిస్తుంది.**

# ఎదిరించిన రక్తం

— జి. భాను, బి. ఏ ఆనర్సు.

ఐదుగంటలకు ఫాక్టరీనుండి బయటకు వచ్చాడు చిరంజీవి. గుండెనిండా గాలి పీల్చుకొన్నాడు. స్వేచ్ఛగా అంతా కలయజూచాడు. నీరెండ అదో మోస్తరు కాంతితో మెరుస్తున్నది. ఆయిల్ కంపుతో నల్లగా ఉన్న బట్టల్ని దులుపుకొని రోడ్డు వెంట నడిచాడు. గోడమీద కొత్తసినిమా పోస్టర్లు కనబడుతున్నవి. 'అరే! మధ్యాన్నం లేవే ఇక్కడ' అనుకొన్నాడు. 'భలేగా ఉందే బొమ్మ! పిస్తోలుమీద ఎంత పోజ్గా పండుకొందో ఆ అమ్మాయి! అబ్బే! బట్టలు సరిగ్గా కట్టుకోనన్నా లేదుమరి. ఏ సినిమో!' అనుకొని ఇంకో పోష్టరు చూశాడు. 'అబ్బో! ఇమావాలు! ఏమైనా దీన్ని చూడాలిసిందే!' అనుకోగానే గబుక్కున తండ్రి మనస్సులో కనబడ్డాడు.

'అమ్మో......ఇంకేమన్నా ఉందా? అరవై పైసలు తగ్గితే చితగ్గొట్టి పారేయడూ మా అయ్య!' భయంగా అనుకొన్నాడు పన్నెండు సంవత్సరాల పత్రబాడు చిరంజీవి.

కుడిచెయ్యి నిక్కరు జేబులో పెట్టి దానిలోని డబ్బు పైకితీశాడు. ఒక రూపాయి కాగితం, తొంభై పైసలు ఉన్నవి. రూపాయి కాగితాన్ని చొక్కా జేబులో వేసుకొని, చిల్లరడబ్బుల్ని నిక్కరు జేబులో వేసుకొన్నాడు. చొక్కా జేబులోని రూపాయి తండ్రికి ఇవ్వవలసింది! నిక్కరు జేబులోని చిల్లర ఇంట్లో తల్లికి ఇవ్వవలసింది!

నిక్కరు జేబులోని డబ్బులు మోగిస్తూ స్టేషన్ దగ్గరకు వచ్చాడు. రోడ్డు ప్రక్కన, కటకటాల దగ్గరఉన్న, గానుగ చెట్టుక్రింద బఠానీలు, వేరుసెనగకాయలు అమ్మే ముసలమ్మకోసం చూశాడు. 'ఓ, ఐదుపైసలు వేరుసెనక్కాయలు కొనుక్కుంటే బస్సుస్టాండుదాకా తినొచ్చు. కొసరుకూడా వేస్తుంది రెండు మూడు కాయలు!' అనుకొంటూ జనంలోనుంచి ముసలమ్మ కూర్చుండే చోటుదగ్గరకు వెళ్ళాడు. కానీ ముసలమ్మ లేదు. 'ఎందుకు రాలేదో పాపం! ఒంట్లో బాగోలేదేమో! అంత ముసల్దయినా డబ్బు సంపాయిస్తుందే!' అనుకొన్నాడు చిరంజీవి. ఒకరోజు 'అవ్వా! ఇంత ముసల్దానివి. నీ కెందుకింత కష్టం?' అని అడిగితే 'కానాముంది మనమ లున్నార్రా మనవడా! ఎట్లా గడుసుద్దిరా ఈ గడ్డురోజుల్లో! నే సంపాయియ్యాకపోతే కంచాల్లోకి బువ్వ ఎట్టా రాది?' అన్నది బోసినోటితో.

ముసలమ్మ సంగతి ఆలోచిస్తూ మళ్ళా రోడ్డు ఎక్కాడు, 'మా అయ్యకంటే ఈ ముసలమ్మే మంచిది! ఏదో బంట్రోతు ఉద్యోగం చేస్తున్నాడన్నమాటే గాని మా అయ్య ఒక్క పైస ఇంటికాడ ఇస్తాడా? మళ్లీ రోజూ పూరాగా తాగొస్తాడు. మంచి కూర చెయ్యలేదని అమ్మని చితకదంతాడు... అన్నకొచ్చే జీతం మొత్తం ఆఫీసుకాడే లాగేసుకొంటాడంట! అడు పిచ్చోడు కాబట్టి జీతం అంతా అయ్యకిచ్చి వట్టిచేతులు

మ్రోగిచ్చుకొంటూ, చినిగినబట్ట లేసుకొంటన్నాడు. అసు ఎదురుతిరిగితే బాగున్ను! నేనంత పెద్దయితేనా...?

కాకా హోటల్లో ఉల్లిపాయ పకోడీల వాసన వస్తున్నది. చిరంజీవి నోటిలో లాలాజలం ఊరుతున్నది. పదిపైసలతో పకోడీలు కొనుక్కుంటే ... అనుకొన్నాడు చిరంజీవి. ఇంటికొచ్చే డబ్బుల్లో పదిపైసలు తగ్గితే ... మిగిలేది ఎవళ్ళు. అమ్మ ... 'ఇంతేనా' అంటుంది దీనంగా. అమ్మ తిట్టకుండా అట్లా దీనంగా అంటే కడుపులో చెయ్యిపెట్టి దేవినట్లుంటది. 'బాబా! మీఅయ్య కిచ్చిన తర్వాత మిగిలిన డబ్బులన్నీ ఇంటికే తీసుకరా. మనకి సాలవురా' అంటది చినిగినకోకే ఎన్నోమాసిక లేసుకొని కట్టుకునే అమ్మ. కానీ అయ్యకి రూపాయి ఇవ్వొద్దని చెప్పదేం...?

అడుగులు లెక్కపెడుతూ నడుస్తున్నాడు చిరంజీవి. నలుగురైదుగురు పిల్లలు ఉత్సాహంగా ఇళ్ళకు వెళ్తున్నారు. ఏవోమాటలు చెప్పుకొని కాబోలు నోరార నవ్వు కొంటున్నారు. అందరూ దాదాపు చిరంజీవి ఈడువాళ్ళే! ఎదురుగా వస్తున్న ఆ పిల్లల్ని చూడగానే చిరంజీవికి అసూయాభావం కల్గింది. 'వాళ్ళు ... తనవయస్సు వాళ్ళు! అంత సంతోషం ఎట్లావస్తున్నదబ్బా! తనకి రాదేం? ఎందుకని? నీలిరంగు నిక్కర్లలో, మల్లెపువ్వువంటి చొక్కాలలో ఎంతబావున్నారు వాళ్ళు! చేతుల్లో చిన్న తెల్లరేకుపెట్టెలు! దాంట్లో పుస్తకాలుంటాయికాబోలు! చదువుకొంటే ఎంత బాగుణ్ణు! వీళ్ళ అమ్మోళ్ళు ఎంతమంచోళ్ళో! పిల్లల్ని బాగా సదివిస్తున్నారు! ఈ వూహాలు మనస్సులో కదులుతుండగా తనతండ్రి తనచదువుకు సమాధికట్టిన సంఘటన గుర్తుకు వచ్చింది.

... ఐదు సంవత్సరాల క్రిందట ఒకరోజు. వాళ్ళ ఇంటిదగ్గర పిల్లలందరూ పలకాపుస్తకాలూ తీసుకొని బళ్లోకి పోతున్నారు. తల్లిదండ్రులు తాముగా బడికి పంపకపోయినా చిరంజీవికి వెళ్లాలనిపించింది. ఇంట్లో చెప్పకుండా వాళ్ళతోపాటుగా ఉత్సాహంగా వెళ్ళాడు. బడిలో ఎంతోబాగున్నది. ఆటలు, పాటలు చెబుతున్నారు ఉపాధ్యాయులు. చిరంజీవికి బడిమీద ఆసక్తికల్గింది. మరుసటిరోజు మారాంచేసి ఏదోవిధంగా వాళ్ళ అమ్మచేత పలక కొనిపించి క్రమంగా బడికి వెళ్ళడం మొదలు పెట్టాడు. అక్షరాలు నేర్చుకొన్నాడు. గుణింతాలు వచ్చాయి. ఒంట్లు నేర్చు కొన్నాడు. ఎగగొట్టకుండా బడికివెళ్ళడం అలవాటు అయ్యింది. చదువుకోవాలనే పట్టుదల ఎక్కువయ్యింది. అక్షరాలు సరిగారాని అన్న రాములుకూడా మురిసి పోయాడు. తల్లి అయితే బాగాచదువుతున్న చిరంజీవుల్ని ఆప్యాయంగా మెటికలు విరుచుకొనేది. రెండోతరగతిలోకి వచ్చాడు చిరంజీవి. చదువంటే శ్రద్ధ ఆచిన్న మనస్సులో మిక్కుటంగా కల్గింది.

ఒకనాటి సాయంత్రం చిరంజీవి బడినుండి ఇంటికివచ్చినప్పుడు ఒక సంఘటన జరిగింది. తండ్రి ఎవరో పెద్దమనిషితో మాట్లాడుతున్నాడు. ఆపెద్దమనిషి ఒక్కొ

సారి తండ్రిని గద్దిస్తున్నాడు. కొన్నిమాటలైనతర్వాత తండ్రి చిరంజీవిని ఆ పెద్ద మనిషికి చూపించాడు. అప్పుడు చిరంజీవికి ఏమీ అర్థంకాలేదు. మరుసటిరోజు తండ్రే స్వయంగా బడిలోనికి బదులుగా షాంఢ్రీలోనికి బలవంతంగా అప్పజెప్పినప్పుడు తండ్రి భావం అర్థమైంది. షాంఢ్రీలో ఏమీచేయలేక కన్నీరుకార్చిన చిరంజీవి సాయంత్రం ఇంటివద్ద చదువుకొంటానని పేచీపెట్టినప్పుడు చిరంజీవి వీపుతోపాటు పలకకూడా పగిలిపోయింది. తండ్రి స్వభావం బాగా అవగతమై పోయింది.

'ఒరే సన్నాసి! సదుంకొని ఏంజేత్తావురా నువ్వు? బియ్యేలు సదుంకొన్నవోళ్ళే బీడీకొట్లు, హోటేళ్ళు పెట్టుకొంటావుంటే నీకెందుకురా శెమ. మనకి తింటాకే లేదు. ఇంకా సదువేంటి? మీయన్న జూడు. నాహూటిని సక్కగా పనిజేసుకొంటల్లా. నీను రోజుకి రూపాయివస్తది. అద్దరూపాయి నాకిచ్చి, మిగతాది మీయమ్మకియ్యి. తెలిసిందిరా. ఏడవమాక ఆడవుండలా. యేడిశావో మల్లీ మక్కలిరగదంతా' అన్నాడు బండబూతుల పల్లవిలో.

ఆనాటితో చిరంజీవి చదువుకు స్వస్తి. ఆ చిన్నారి మనసులోని ఆశలు మట్టికొట్టుక పోయాయి. చదువు కలయైపోయింది. కన్నతండ్రే తన బ్రతుక్కు, ఇంటి సుఖానికి రాక్షసుడుగా పరిణమించాడు. ఐదేళ్ళుగడచిపోయాయి. రోజుకూలి రెట్టింపైంది. తండ్రి కివ్వవలసిన ముడుపుసొమ్ముకూడా రెట్టింపైంది. శ్రీశ్రీ తండ్రిగారి తాగుడుకూడ రెట్టింపైంది. దాన్ని అడ్డుకొనేశక్తి వాళ్ళఇంట్లో ఎవరికీ లేకపోయింది.

చిరంజీవి మనస్సులో కసితోకూడిన అసహాయత్వం తండ్రిపట్ల బుసబుసం విప్పిన నాగుపాములా బుస్సు మన్నది.

చిరాగ్గా నడుస్తున్నాడు చిరంజీవి. వస్తూపోతున్న రిక్షాల్లా కార్లలా నాడితలలో ఆలోచనా పరంపరలు.

చిటారికొమ్మన మిఠాయిపొట్లంలా రోడ్డుప్రక్కన మిఠాయిషాపు! అందంగా తీర్చిదిద్దిన, రంగురంగుల, రకరకాల పదార్థాల రాసులు! అవి అద్దాల్లోనుండి, గ్లాసులలోనుండి అభిరుచుల్ని తమవైపు ఆకర్షించుకొంటున్నవి! మెర్క్యురీలైట్ల తెల్లని కాంతిలో బహుసుందరంగా కనబడుతున్నదా మిఠాయిషాపు! గుటకలుమింగుతూ అంతకు ముందున్న ఆలోచనలకు ఆనకట్టకట్టారు. ఏనాటినుండో తన చిన్నచెల్లెలు జిలేబి తెమ్మని పోరుపెడుతున్నది. తనకీ తినాలని ఎప్పటినుంచో ఉన్నది. ఎంతకాలమో చెల్లెల్ని మభ్యపెడుతూ, తననోటికి చిక్కంపెట్టుకొంటూ వచ్చాడు. కానీ ఈనాడు ఎందుకనో చిరంజీవిలోని వాంఛ ఆపరానిదైంది. తనకోర్కెను, చెల్లెలి ముద్దును తీర్చకోవాలి అనుకొన్నాడు. ఇంటికిచ్చే డబ్బుల్లోఖర్చుపెడితే అమ్మ బాధపడ్తుంది. తండ్రికిచ్చే డబ్బులో కొనుక్కుంటే చావుదెబ్బలు తినాల్సిందే! ఎలా? ఏంచేయాలి? అని తర్కించుకొని ఒక నిర్ణయానికి వచ్చాడు. తండ్రికి ఏనాడూ తగ్గించి ఇవ్వలేదుగదా!

ఈరోజు తగ్గించి ఇచ్చిచూద్దాం! పరిస్థితి విషమిస్తే అమ్మతో ఎలాగైన చెప్పవచ్చు అనుకొని పావలా జిలేబిపొట్లం కట్టించుకొని, జాగ్రత్తగా పట్టుకొని తండ్రి ఉండే బిల్డింగ్ వైపు బయలుదేరాడు.

ఒక మనిషి తన పిల్లలకు వద్దన్నా కొనిపెడుతూ, ముద్దుచేస్తూ పోతున్నాడు. ఎవ్వరో తల్లిదండ్రులు రిక్షాలోవెళ్తూ పిల్లలతో ముద్దులాడుకొంటున్నారు. బ్రిడ్జిమీద అంటించిన పోస్టర్స్‌పైన పిల్లల్ని బుజ్జగిస్తున్న అమ్మబొమ్మ, నాన్నబొమ్మ, ఎంతో అందంగా కనబడుతున్నవి.

చిరంజీవి మనస్సులో అసంతృప్తికరమైన అనేక భావాలు తారట్లాడుతున్నవి. నడుస్తున్న అతని దృష్టి వృథాగా నీళ్ళుపోతున్న కుళాయిమీద పడింది. 'అరెరే! నీళ్ళన్నీ అనవసరంగా పోతున్నాయ్! మాఇంటిదగ్గరైతే కుళాయిదగ్గరే సంత!' అనుకొన్నాడు.

—— చూడగా, చూడగా ఈకుళాయికి మా అయ్యకి తేడా కన్పించడంలేదు. ఈ నీళ్ళేమో ఊరికేపోతుంటే, మా అయ్యేమో నీళ్ళలాగే మా డబ్బును ఖర్చుపెట్టుకొంటున్నాడు ... అమ్మకి, చెల్లికి, అన్నకి, నాకు బట్టలులేవు ... చిరుతిండి సంగతేమో దేవుడెరుగు... సరిగా తిండేలేదు... చదువులేదు... ఏమీలేదు... సంపాదించడం... సగంకంటె పైనే ఆయన చేతిలో పోయడం ... ఆయనేమో జల్సాగా తాగుతూ, తందనాలాడ్డం ... పైగా మంచిచెబితే... బండబూతులు తిట్టడం... తన్నడం... ఎంతకాలం ఇట్లా? !మాఅయ్యకి బుద్ధి ఎప్పుడొస్తదో? ఏమైనాసరే ఇప్పుడు అడిగి తీరాల్సిందే? తలగొట్టి మొలేస్తాడా? - ఇటువంటి ఆలోచనల ఉద్వేగంలో తండ్రి ఉండేచోటు దగ్గరకు వచ్చాడు.

తండ్రి తనకోసమే ఎదురుచూస్తున్నట్లు నుంచున్నాడు. తండ్రి చూపులో చిరంజీవికి సున్నితమైన భావం ఏకోశాన కనబడలేదు. అనుకొన్న ఆలోచనలు, మాటలు తలలోనుండి పలాయనమైనాయి. అయినా నిబ్బరంగా తండ్రిపక్కన నుంచున్నాడు; అది మామూలు విధానానికి విరుద్ధం! తండ్రి మాట్లాడలేదు; చిరంజీవి నోరు మెదపలేదు. తండ్రి ముఖంలో విసుగు, కోపం కనబడ్డాయి.

'ఊఁ... ఏంట్రా ఆలిశం... తొందరగా... రూపాయిచ్చి... పోరా ఇంటికి' అన్నాడు.

'రూపాయి లేదు... నిండగా' చిరంజీవి గొణిగాడు.

'ఏం... ఎందుకులేదు? ఎందుకురా లేంది?' తండ్రి గొంతు.

'మనచిట్టికి... పావలా... జిలేబి కొన్నాను'

'ఎందుకురా జిలేబి' కోపంతో తండ్రిగొంతు ఖంగ్‌మంది.

'తింటాకి...'

'గడ్డితిన కూడదురా... అడివిసక పోతే...' తండ్రి అన్నాడు.

ఆమాటతో చిరంజీవిలోని రక్తం తిరగబడింది. గుండె మండింది.

'నువ్వే గడ్డితినగూడదా ... సారాతాక్కపోతే...' రోషంగా అన్నాడు.

'ఒరే! ఒరే పుండాకోర్ వెధవ! ఏంట్రా నువ్వు కూసింది...నిన్ను నరుకుతా... ఇంటికి పదరా' అన్నాడు.

అంతలో అక్కడి సంరంభానికి జనం చాలమంది మూగారు. చిరంజీవి గుండెలో పిచ్చిధైర్యం ఊరింది.

'అయ్యా! నన్ను నరుకు...అమ్మని, అన్నని, చెల్లినికూడా నరికేసెయ్యి... నువ్వుమాత్రం జల్సాగా తాగు ... తిను ...మేము బట్టల్లేకుండా... బువ్వలేకుండా ఉంటాం...నువ్వు మాత్రం సర్దాగా ఉండు... మేము నయాపైస కొనుక్కో కూడదు... నువ్వేమో రోజూ రుపాయి మింగొచ్చు...నీకిచ్చిన డబ్బుకి నీళ్లో యేసిన డబ్బుకి ఏందయ్యా తేడా... మాకు సరుకులు లేకుండా పస్తోబెట్టి, ఆడబ్బుల్తో నువ్వేమో కులుకుతున్నావ్ కమ్మగా... అందరూ నీలాగే పెంచుతున్నారా పిల్లల్ని... ఇన్నాళ్ళకి ఒక్క పావలా జిలేబి చెల్లికి కొన్నందుకు గడ్డితినమన్నావ్... ఇదుగో అసలు నేనే యిద్దామని తెచ్చా ఈరూపాయి కాగితం... కానీ యిప్పుడు మాత్రం... నీకు యియ్యాలంటే యియ్యను... నీకిచ్చినా నిప్పుల్లో ఏసినా ఒకటేగా... ఇదుగో చూడు... ఈ రూపాయి...' అని ముక్కుపుటాలు అదురుతుండగా రూపాయికాగితాన్ని ముక్కలు ముక్కలుగా చింపి, తండ్రి ముఖానకొట్టి 'ఇక ఏంజేస్తావో చేసుకో' అని ఒకటే పరుగులంకించుకున్నాడు ఇంటివైపు.

చుట్టూ మూగిన ప్రజల చూపులు మాటలు స్థాణువులా దోషిగా నుంచున్న సూరయ్యను చిత్రవధ చేశాయి. ఏనాడు ఊహించని అతివిచిత్ర సంఘటనకు దిగ్భ్రమ చెందిపోయాడు. సిగ్గుగా తల దించుకున్నాడు. అతని హృదయంలో ఏమి సంఘర్షణ బయలుదేరిందో ఏమోకాని మౌనముద్రాంకితుడయ్యాడు. కాకుల్లా పొడిచిన జనం క్రమంగా మబ్బుల్లా విడిపోయారు. సూరయ్య మనసులోని మబ్బులుకూడా విడిపోయాయి. అతనిలో వివేకం పొడచూపింది.

అతను నవ్వుకున్నాడు. కన్నీరు తుడుచుకున్నాడు. ఆనందబాష్పాలు రెండు చేతులతో తుడుచుకున్నాడు.

ఇంటివైపు, తాను నిర్లక్ష్యం చేసిన చిన్న స్వర్గం వైపు, పరుగెత్తినట్లు నడిచాడు.

# శాపగ్రస్తులు

— శ్రీ గాదేపల్లి సుబ్బేశ్వరరావు, ఎం. ఏ.

*

"ఏడువు దేడువు!" డన్న
ట్లీ 'దెబ్బదియేడు' రెండు ఏడంకాలతో
మూడించె నీడు తెలుగున్
వాడలవాడలను ముంచివైచి జలధులన్.

*

ఆది 'శని' పట్టినవాగను
హృదయ విదారకము, తల్లులెటో పిల్లలెటో !
ముదురు తమస్సున నుప్పెన
యుదగమ్మున శవములగుచు నాగగిరి త్రుటిలో.

*

కొట్టుమిట్టాడి యేపట్టు చిక్కక కన్న
బిడ్డను గంగ కర్పించె తల్లి
ముక్కునోటను జలమ్ములు గ్రమ్మి యుక్కిరి
బిక్కిరై ప్రాణముల్ విడిచె జనము
తలదాచుకొన నేగి బలుభవంతులు నాల
యములు కూల సమాధిరైరి ప్రజలు
కడలేని కడలి యాకలిదప్పులకు దప్ప
శము లారెను గ్రామగ్రామములు మునిగి

నుడువ నోర్లేని పశువులా నడికరేయి
అనుభవించిన మరణయాతనకు సాక్షు
లుదధి కెరటాలు యమకింకరోత్కరములె
కన్నయదికాదు విన్నదికాదు మునుపు.

*

హతశేష సహాయార్థము
ఎవడు ధనముదండి వారికీక కుడుచునో
అతనికి దేవుడు విధియిం
చుత ! అరగక కక్కుకక్కు శుష్కించు రుజన్.

* * *

# ఈ పక్షంలో

### గౌతమీ గ్రంథాలయము.

'ప్రసిద్ధమైన గౌతమీ గ్రంథాలయాన్ని ప్రభుత్వం స్వీకరించే విషయంలో సత్వరనిర్ణయంతీసుకోవాలి. లేనిచో జిల్లా గ్రంథాలయ సంస్థకి అప్పగించాలి. భవనం కూలి గ్రంథాలు నశించే ప్రమాదం రాక మునుపే సముచిత నిర్ణయం తీసికోడానికి ప్రజలు ఆందోళన చేయాలి' అని జిల్లా గ్రంథాలయసంస్థ చైర్మన్ శ్రీ కె. బి. కొండలరావుగారు రాజమండ్రి మహిళా గ్రంథాలయ ప్రారంభోత్సవ సందర్భంలో తెలిపియున్నారు. - ఇందు మొదటిదే ఉత్తమ పక్షానికే చాలకూడ ప్రయత్నించడం సముచితం కాగలదు.

### కవి :

"హృదయంవున్న ఏకవిఅయినా పేదప్రజల పక్షపాతి అవుతాడు. లేకుంటే కవి కానేరడు" రాజమండ్రిలో అని సెట్టి సన్మానసభకి అధ్యక్షత వహిస్తూ అ. ర. సం. సహాయకార్యదర్శి శ్రీ సోమసుందర్ పలికిన మాటలివి. - ఈవాక్యాలలోని కవి శబ్దానికి పూర్వం 'ఉ.' చేర్చడం సముచితం కాగలదు.

### గోలింగు ప్రణాళిక :

రాజమండ్రి శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటుస్కూలులో ప్రోగ్రెసివ్ ఫోరం యాజమాన్యమున ఈనెల 1,11 తేదీలలో సభ జరిగినది. గోలింగు ప్రణాళిక, పంచవర్ష ప్రణాళికలపై చర్చలో పలువురు ప్రముఖులు పాల్గొన్నారు. గోలింగుప్రణాళిక ప్రస్తుత పరిస్థితులలో చాలా మంచిది అని కొందరూ, రాజకీయపు ఎత్తుగడతప్ప దానిలో చిత్తశుద్ధిలేదని కొందరూ ఉదాత్తానుదాత్త ధోరణిలో ప్రసంగించడం జరిగింది.

### మహిళా గ్రంథాలయం.

రాజమండ్రి దానవాయిపేటలో 11-12-77 న మనజిల్లాకే ప్రప్రథమంగా మహిళా గ్రంథాలయమునకు ప్రారంభోత్సవం జరిగినది - స్త్రీలు పురుషులతో సమానంగా అన్ని రంగాలలోను నూతన వికాసము నొందుచున్న యీ కాలములో రాజమండ్రిలో మహిళా గ్రంథాలయారంభం అత్యంత హర్షదాయకం.

### సాహిత్య అకాడమీ బహుమతి గ్రంథములు.

1977 సం॥ ఉత్తమ గ్రంథంగా కేంద్ర సాహిత్య అకాడమీవారి 5 వేల రూప్యముల బహుమానం తెలుగులో శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారి "కుందుర్తి కృతులు" అను గ్రంథానికి లభించింది.

1977 సం॥న ఉత్తమ గ్రంథములుగా ఈక్రిందివి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచే 1116 లతో బహూకరింపబడినవి.

నవల-సంసారవృక్షం, శ్రీ ఆర్. యస్. సుదర్శనం; నాటిక-ధనుర్దాసు. శ్రీ కృష్ణశాస్త్రి. చిన్నకథ - పశ్చిమచక్రం, విహారి శాలివాహన; కవిత - నిశ్శబ్ద తరంగాలు. శ్రీ ఎల్లోరా; విమర్శ - తెలుగు నవలా సాహిత్య వికాసం, శ్రీ బొల్లాభొట్ల వెంకటేశ్వర్లు. - ఏతద్రచయితలకు అభినందనములు.

పై గ్రంథముల వైశిష్ట్యాన్ని వివరించే విమర్శక వ్యాసాలకు "సమాలోచన" స్వాగతం ఇస్తుంది.

*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపై, దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురింపుట మా యభిలాష.

రచన మాకుఁజేరిన వారమురోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలా స్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్త పుస్తకములను రివ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతవఱకు రివ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

---



*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*-*

Regd. No. H/Rmy-42. Samalochana. 16 Dec. 1977

## —* ఈ సంచికలో *—



* వచ్చే జనవరి 1 సంచికలో శ్రీ ఆర్. యస్. సుదర్శనం గారి "సంసార వృక్షం" మీద సోమసుందర్ విమర్శన వ్యాసం ఉంటుంది.


అడ్రసు :—

సంపాదకుడు,

బులుసు సీతారామశాస్త్రి,

6-8-7, ఇన్నీసుపేట, రాజమండ్రి-1.


Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at
B. V. & Co. Press, Innispet, Rajahmundry-1.